శ్రీమత్పరదేవతాయైనమః

# పాండవరాజసూయము

తిరుపతివేంకటేశ్వరప్రణీతము.







అభినవసరస్వత్యనుబంధము




మొదటికూర్పు ౧౦౦౦ ప్రతులు.

1921 సం.

చంద్రికాముద్రాక్షరశాల,

గుంటూరు.




[ ౫ అణాలు.

# ఉపోద్ఘాతము

చదువరులారా !

ఈ "పాండవరాజసూయ" మను చిన్న నాటకమున శిశుపాలవధ రూపమగు నితివృత్తము తగుపాటి మార్పులతోఁ బ్రస్తావింపఁబడినది. ఇతరనాటక ప్రస్తావనలకును దీనికిని జాలభేదముకలదు. ఈయపూర్వ ప్రస్తావనయందలి విశేషమును దజ్ఞులవలన నెఱుఁగఁదగు, నేనుబందరు హైస్కూలులోని యాంధ్రపండితస్థానమును వదలికొని స్వగ్రామమునకు వచ్చుదినములలో రచింపఁబడిన దగుటచే నిదియిప్పటికి సుమారుగా నైదువత్సరములక్రిందటనే ముద్రితము కావలసియున్నను ననేక కారణములచే నింతవఱకుఁ బ్రకటితము కాదయ్యె. ఆలస్యమునకుఁగల కారణములలో ముఖ్యకారణమిటీవల ముద్రణవిషయమున మాకు సంభవించిన పాలుమాలికయే యని మాచదువరు లరయఁగలరు. దీని యుపోద్ఘాత మింతకన్న విస్తరింపవలసినదికాకున్నను ప్రస్తుతము నిర్వ్యాజముగా నన్ను నెలకు 25 రూపికలవంతున నొసఁగి గౌరవించుచున్న శ్రీ శ్రీ రావురామయాంబారాజ్ఞీమతల్లికంగూర్చియు వీరిసోదరులును వీరికిట్టియశస్కరములగు మహాకార్యములకు మార్గప్రదర్శకులును, ఆంధ్రభాషా నిత్యపోషకులునునగు శ్రీ శ్రీ చెలికాని లచ్చారావుగారింగూర్చియుఁ గొంతయేని ప్రశంసింపకుండుట కృతజ్ఞలక్షణము గాదనియెంచి యేతద్రచన చాలఁగాలమునాఁటిదే యైనను బ్రచురణమునాఁటికి వీరికిని నాకును బాల్యపాలక సంబంధమనువుపడుటచేఁ గొంతప్రస్తావించుచున్నాఁడను.

(కామేశ్వరీశతకమునుండి)

మ॥ నరనాథుల్ పలుమంది మిత్రులయి యున్నంగాని తత్సన్నిధిన్
స్థిరవాస మ్మొనరించునట్టిపని నాచేఁగాదు నీవంటి స
త్కరుణాశాలిని పెంపఁగాఁ బెరిగి విద్యాబుద్ధులన్నేర్చునేఁ
బరులన్నిత్యముగొల్చు టొప్పగునెయంబా? దేవి? కామేశ్వరీ!

(దక్షిణనుండి)

ఉ॥ ఎందఱో రాజులుండిరి యహీనులు నాయెడఁ బేర్మిభక్తియు<br>
విందుతనంబు గల్గిన వివేకులు; వారలయొద్దనుంటినే?<br>
గందరగోళమైన మదిగల్గిన వాఁడ స్వతంత్రుఁడన్ జిదా<br>
నందుఁడ నేనొకానొకని నాయకుఁగా వరియించి యుందునే॥

పై పద్యములయందలి నా యభిప్రాయమునకించుకయు మార్పు లేని పద్ధతిని శ్రీ లచ్చారావుగారు నాకీపోషణ భృతకము నేర్పఱిచి వారి సోదరీమతల్లికకుఁ గృతయుగదాతృత్వపదవిని సమర్థించిరని వ్రాయుచున్న నా వ్రాతవలన సర్వమును విజ్ఞలోకమునకు సుస్పష్టమే కావున దీని నింక విస్తరింపక యీ రాజ్ఞిం గూర్చి యొక పద్యము నుదాహరించుచున్నాఁడను.

క॥ కోలంక వీరవరముల<br>
నేలు జమీందారురాలు హితమతితో నేఁ<br>
డాలంబమగుచు గవితో<br>
ద్వ్యాలున్ బోషించుచుండె వెంకటశాస్త్రిన్॥

ఈ పద్యము మా తిరుపతిశాస్త్రి తుట్టతుదిదినములలో రచింప మొదలిడిన "ప్రభావతీ ప్రద్యుమ్న" నాటకపుఁ బ్రస్తావనలోనిది.
అందలి—

కవికుత్కీలున్ బోషించుచుండెఁ దిరుపతిశాస్త్రిన్॥

అనునది ప్రకృతోచితముగా నిందు మార్పఁబడినది. ఇందలి కోలంక వీరవరగ్రామములు పిఠాపురమునకు సమీపమునందలివి. శ్రీశ్రీ పోలవరపు జమీందారుగారు స్వర్గస్థులైన పిమ్మట మా తిరుపతిశాస్త్రి రెండు వత్సరములు జీవించియుండెను. ఆ కాలమున నతనిని సబహుమానముగ రప్పించి సర్వవిధముల నాదరించి పోషించిన వారీ రామయాంబారావుగారే, ఇటీవల నాతని కుటుంబమునకు వత్సరమొక్కటికి నూటపదియాఱులవంతున శాశ్వత వార్షికము నేర్పఱిచిన

దయావతి యీపతివ్రతాతిలకమే, ఆయీయంశములు నాచే నీమధ్య రచింపఁబడిన "దివాకరాస్తమయమున" విస్తరింపఁబడి యుండుటచే నిందింతతో ముగింపఁబడుచున్నది. ఇంతదనుక మాగ్రంథములలోని పీఠికలలో నిరువురపేరులును నుండుట మీరు చూచుచున్నారు, ఆగ్రంథములలోఁ గొన్ని యుభయరచితములైనను గొన్ని యీనాటకమునంబలె బ్రత్యేకరచనలును గావు, ఏమైనను నుభయనామము లుండుటయే మీ రెఱుఁగుదురు, ఇపుడా శ్రీవరు భంగముగలిగించిన భగవంతుని దైవికమనుచు నే నొక్కఁడనే చేవ్రాలుచేయుచు నీయుపోద్ఘాతమును ముగించుచున్నాఁడను.

 చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రి, శతావధాని.



# ఇందువచ్చు పాత్రములు.

౧ సహదేవుఁడు

౨ శిశుపాలుఁడు

3 ధర్మరాజు

౪ భీముఁడు

౫ అర్జునుఁడు

౬ నకులుఁడు

౭ భీష్ముఁడు

౮ నారదుఁడు

౯ శ్రీకృష్ణుఁడు

౧౦ నందికేశ్వరుఁడు

# తప్పొప్పులు.

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 8 | 7 | డై | ఢై |
| 8 | 12 | దీక్షు | దీక్షా |
| 7 | 8 | పం | వం |
| 7 | 4 | చిన | బిన |
| 7 | 9 | లెలుంగ | వెలుంగ |
| 7 | 11 | ద్రుంప | దుర్ంగ |
| 8 | 18 | శేఁడి | లెండి |
| 8 | 14 | చ్ఛర | చ్చర |
| 8 | 20 | కెవ్వఁడో | కెప్పుడో |
| 8 | 24 | చల్లగా | చల్లఁగా |
| 11 | 19 | టుల్ | టిల్ |
| 12 | 5 | కాలు | కాలి |
| 12 | 16 | తిగు | తిఘు |
| 13 | 14 | తొందర | తొందరగా |
| 14 | 20 | ల్లసంత | ల్లంతన |
| 15 | 9 | కట్టెఁడుల్ | కట్టెఁడుల్ |
| 15 | 26 | తక్షణ | తత్క్షణ |
| 16 | 9 | మది | మధి |
| 17 | 21 | ధా | థా |
| 18 | 2 | ఢైర్య | ధైర్య |
| 19 | 15 | నవ్వఁగు | నవ్వఁగ |
| 21 | 15 | లెట్టి | లెన్ని |
| 22 | 16 | బెరిగ | బెరిఁగ |



శ్రీమత్పరదేవతాయైనమః

# పాండవరాజసూయము.

(తిరుపతి వేంకటీయము)

చ॥ సరసుఁడు నాగభూషణుఁడు చారుతరాప్రతిమానగాత్ర భా
స్వరుఁ డురుగాన నాట్యముఖ సర్వకళానిలయుండు భూతివి
స్ఫురితుఁ డమాంకుఁడుంచు నిజబోధసుధామయుఁ డొప్పుచుండు శ్రీ
హరి హరిచింతనామృత సమర్పితనైజమనఃప్రచారుఁడై॥ ౧

మ॥ అనుసంధ్యమ్మును నాతఁ డాడు సుమనోహస్తధ్వనుల్ పెల్లుగాఁ
గనకుఁ భృంగిముఖుల్ సహాయులుగ సాంద్రంబైన యానందముల్
గనువారల్ భజియింప నాత్మకను భాగస్థాయి సర్వప్రజా
ళిని గీతామృతసారసారపదలచేఁ బోషించి రక్షించుచున్॥ ౨

ఉ॥ ఆతఁడు నాట్యమాడు సమయమ్మున కెయ్యెడ కేగుదెంత్రు పవి
త్రాత్ములు మహాసతల్లజులు గణ్యులు సిద్ధులు సాధ్యులప్సర
శ్శ్రితకాననల్ మొదలుగ; సేవకు నట్లరుదెంచు వారిసం
ప్రీతమనస్కులన్ సలుపు శ్రీహరిఁ జూచుచు నాతఁడాడుచున్॥ 3

ఉ॥ అశ్వపుధాటియో? జలధరార్భటియో? యనుభంగి భృంగి వి
శ్వేశ్వరుఁ "డౌనె? మే?" లనుచు నెంతయు మెచ్చ మృదంగమూని తా
విశ్వవిచిత్రవాద్యమున వేడ్క ఘటింపఁగ నాగభూషణుం
డశ్వరుఁ డాడి పాడునట? యెరలనౌర నుతింపనేర్తురో॥ ౪

తే॥ గీ॥ ఇట్టు లనుసంధ్యమును నాట్యమొలయఁ సలిపి
ముక్తిపత్యత్వఁ మొనరించు మూర్తిగాంట
నితర దైవతములకన్న నితని నెల్ల
సుమనసులువచ్చి సేవింపఁ జూచుచుందు॥ ౫

చ॥ జరిగె ననంతకాలమిటు స్వానుతరాప్రతిమానగానమా
ధురియును దాండవంబు గమందోరముగాఁ గనువారి మానసాం

తరముల నాటికిఁ; నతని తత్త్వమెఱుఁగని వారుగూడ వ
త్తురు కనిపోదురందుఁ దటితో నతఁడాడుచుఁ బాడుచుండఁగన్ ॥ ౬

వ॥ అమ్మహాదేవుం డిట్లనుసంధ్యంబును శ్రీహరి భక్తితత్పర
త్వమ్మునఁ దన విద్యాతిశయమ్ము సఫలమ్మొనర్చుచుఁ దాండవానంత
రమ్మున నొకట సభాస్తారులం గాంచి యిట్లనియె॥ ౭

శా॥ ఈసందోలగవారాలికిని వినుత మే నిష్టాను వాక్యమ్ములు
త్థానైకాదశి వచ్చుచున్నది హరిన్ దత్కాలమందర్చనా
ధీరున్ జేసినవారల న్నిరతమున్ దివ్యన్మహోవైభవా
నూనామూత్రికర(త)సౌఖ్యములు చెందున్ డిందుసర్వాఘముల్॥ ౮

శా॥ ఇందన్కన్ శయనించియున్న హరి నాఁడేత్తించు నందమ్ములో
కందమ్ముల్వికసింపఁజేసి జగమా కంకాతునావేళ నా
నందమ్ముప్పతిలన్ యజింపుటదిసం ధానించుఁ బున్నెంపుఁది
న్నెం దైవారఁగఁ జాలుభాగ్యము నమంగీభూత సామ్రాజ్యమున్ ॥ ౯

క॥ తులసీబృందావనమున
నలఘున్ లక్ష్మీసనాధు హరిదినమునఁ బూ
జలు కార్తికమునఁ జేసెడి
సలలితమతి శాలికొక్క సౌఖ్యము కొదవే॥ ౧౦

శా॥ నేనేమో? "పరతత్త్వమంచు మదిలో నిక్కమ్ము మిమ్మొల్లరున్
ధ్యానింతామహనీయుఁనేఁ గొలుతు సత్యమ్మున్ మహాభాగుఁడా
శ్రీనాథుండు మదీయ నాట్యకలనా సేవ్యం దెఱుంగుంగాని వి
జ్ఞానాంభోనిధియాతఁ; డాతనికి నిచ్చల్ పూజసేయందగున్॥ ౧౧

మ॥ ప్రతిసంవత్సర కార్తికమ్మునను దత్పాదాంబుజమ్ముల్ సుమ
ప్రతతిన్నేయజియింతుఁగాని "యిటుసల్పంబోలు" నంచున్ భవ
న్మతికెక్కన్ వచియింపలేదెపుడు సమ్యాసంపుఁడీయోఁడు న
త్కృతులన్ శ్రీహరినుత్సవాదులఁగడున్ దేదీప్యమానమ్ముగన్"॥

వ॥ నావుడుఁ బరమభక్తులగు సభాసదులు కరమ్ములు మొగిచి
యిట్లనిరి. స్వామీ? యేము నీయందుంబలె శ్రీహరియందును భక్తు

లమ్మత దారాధనమ్మునకై యింతనొక్క సెలవీయంబనిలేద, తప్పక యట్ల యొనరించెదము, కాని కొండొక విజ్ఞాపనంబుగల దయ్యది యాలింపం బ్రార్థించెదము. కార్తికైకాదశినాఁడు స్వామి. మేల్కాంచు రనిక దా? సెలవిచ్చితిరి, నాఁడేదినమ్మున నెచట శయనించియుండినదియు, నాశయనమ్మునకుఁ గతమ్మును వచించి మామనమ్ములు నిస్సంశయమ్ములొనర్పవలయునాఁగ నాగభూషణుండిట్లను॥ ౧౩

క॥ వినుఁడాషాఢైకాదశి
ననఘుఁడతఁడు బోధమూర్తి యహితల్పమునన్
వననిధిని యోగనిద్రన్
గొని విద్యాస్ఫూర్తి మెఱయఁ గొమరారుఁ జూఁడీ॥ ౧౪

కం॥ కార్తిక శుద్ధైకాదశి
నార్తిహరుం డతఁడు త్రిభువనావన దీక్షన్
స్ఫూర్తిన్ మేల్కను సువ్రత
వర్తుల కానాఁడు మిగులఁ బావనమరయన్॥ ౧౫

ఉ॥ కావున నాఁటి పూజ త్రిజగమ్ములకే నెఱిఁగింప నెంచి స
ద్భావులరైన మీకడ ముదమ్మున నేఁడు వచించితిన్ మహా
ధీవిభవుండు శ్రీకరుఁడు దివ్యమహామహితుండు మీదు సం
భావన కర్హుఁడై నెఱుఁగువట్టును దెల్పితి నల్లొనర్పుఁడీ॥ ౧౬

చ॥ అనవుడుఁ దత్సభాసదులు హస్తము లెత్తిరి యెల్లవారు మే
లనిరి "సెబాస్సెబా" యనుచు నాడిరి పాడిరి యేమిచెప్ప నా
ఘనుల హాళాహళుల్; పిదపఁ గాలగళుండల వారి శ్రద్ధకున్
మానసమందు మెచ్చుచుఁ మరల మాటయొదో వినంబడ్డయట్టులై॥ ౧౭

మ॥ "ఎవఁడా బుస్సలుకొట్టు వాఁతఁడని తానెల్లన్ విలోకించి యం
దెవఁడున్ గానఁగ రానిజెచ్చువడి మోమెవ్వంత్రిమో వంచున
ద్దవలోకించె నిజాంగసంగతునహిన్ బ్రారబ్ధకోపానల
స్ఫవిరాస్యున్ నయనాంతరుద్గళదమందస్ఫార దావానలున్॥ ౧౮

పాదతాడనములనట్లుసడియు శీర్ష-
మెత్తిబ్రిదుకునె? యటుమీఁద నేమియైన॥ ౨౬

చ॥ అతని శిరమ్ముపైని హరియంఘ్రులు సిల్పనటించెఁగానిప
ద్ధతి యదిమూఁకు నెల్లరకు నాతనికింబలె సంఘటించె శీ
ర్షతలము మూఁడుమూఁ?కదుభరమ్ముగఁ దత్పదయుగ్మమెల్లము
ద్రితమయి యొప్పుచున్నదియొ తెల్లము నాగులకెల్ల నల్లఁగన్॥

చ॥ అనఘుడు నాగభూషణుని కక్షిగనుండిన సూర్యుఁడెంతయున్
గనలియు లోనడంచకొని క్రమపచో విభవంబెలర్ప ని
ట్లను నిదిగొప్పతప్పనుమి ? యూహరిమీఁకొలమందొ కానొకం
డనఁదగువానికిన్ సలుపు నాయపకారమిటుల్ గణించుటల్॥ ౨౭

చ॥ ఎవనికిఁగాని యెన్నఁడును నెవ్వఁడు సత్కృతి సేయకుండు వాఁ
డవని వినంబడండు, యపుడప్పుడటుల్ ఘటియించువాని క
ల్లవమతివాఁడొనర్చుటకునై పలు హేతువులుండితీరు నా
యవమతిజాతికంతోకును నబ్బినయట్లు తలంపఁగూఁక నే॥ ౨౮

క॥ అదికారణముగఁ బుణ్యా
స్పదమగు సత్కృతికి నడ్డుసల్పి వృథాదు
ర్మదము వెలార్చుట తగునే ?
సద్గ్రహులు పల్కునట్టి సదములయమున్॥ ౨౯

క॥ ఇప్పగిదిహరుని యంగపు
సప్పమ్మును మందలించె సత్సేవ్యంబై
యొప్పారు సూర్యుఁడింకొక
సప్పము తలనెత్తి యంతు సలుపకయుండన్॥ 3౦

మ॥ హరుఁడాశ్చర్యపరీతుఁడై మనమునం "దాఁకొర? యేపాటిదీ
యురగంపుంబురువట్టి శ్రీహరికిరీటోద్దేశికైయుంతగా
నలువన్ సాహసమట్లుగల్గు? నిటసాహాయ్యంబు చేకొన్కతెం
పరిలోలోనునరించి దీనికిఁబ్రజాప్రకత్వమున్ గూర్చెడిన్॥ 3౧

ఉ॥ అట్టిప్రబుద్ధుఁడిం దెవఁ"డటంచుఁ గనుంగొన వీరభద్రుమో
మట్టికళంకమున్ దెలుపునట్టిదియై కనుపట్టె శూలియ
ప్పట్టున దివ్యదృష్టిఁ గని భద్రుఁడదే మొదలంతరంగమున్
బెట్టఁడు విష్ణుపైఁ; మిగుల ద్వేషమె చూపఁగఁడంగు నిచ్చలున్॥ ౩౨

ఉ॥ దక్షునిదుర్మదాంధ్యము వదల్పఁగ వీఁ ఘోరస్వేదజంబుగా
నాక్షణమందు నాహృదయమందలి తీవ్రతఁ బుట్టిపుట్టెఁ న
చ్ఛిక్షకుఁ డేగి యయ్యెడల శిష్టులఁ గూడఁ బరాభవించెఁ బ
ద్మేక్షణుఁ గూడ నీఁడచట నింపుకయున్ గణియింపఁడక్కటా॥ ౩౩

ఉ॥ ఆతఁడు నన్నుఁ జూచి కనుసన్నలఁ బ్రన్ రమణాఁగినిసి దు
ర్నీతికి నైఁచెనా నయిచునేరుపు నీఁడెఱుఁగండుబో త్రిగాఁ
గాతఁడు ఁడాతఁడుం చుమదిఁ గస్గని తన్మహిమానుభావ వి
ఖ్యాతులు లెక్కఁబెట్టక నికారమొనర్పఁగ నెంచు మూర్ఖతన్॥ ౩౪

తే॥ గీ॥ ఈయనాత్మజ్ఞుఁ డెప్పుడో యీశ్వరీస్వ
పమ్ములకుఁ జేసె దుర్బోధచనవుమిగిలి
ఇవిననుంగూర్చ లెక్కింపకింతనోకని
వైకిలేపి ప్రేలించు దుర్భావనాసులు॥ ౩౫

ఉ॥ ఏమఁట? చెప్పవాఁడవఁట? యెల్లజగమ్ములనేలు శ్రీహరిన్
ధ్యానమొనర్పఁడంచది సదస్సఖిలమ్ము వినంగ నెంతొ బట
ద్దానికి నన్మదంగమునఁ దాల్పనె నాగమొకంపు వారకే
జానఁట? యింతకన్నఁ గలదా? యిల దారుణసాహసంబహాహా॥

తే॥ గీ॥ వీరభద్రుండొకించుక ప్రేరణంబు
చేసినేయన్న హరిపయి నీసుకతన
నంతమాత్రన నామాటకడ్డు చెప్పఁ
దలఁచుపాటిదె యీహాలాహలపుఁ బురుషు॥ ౩౬

చ॥ అనితనయాంశమై హరికినర్చలొనర్చి తదీయతత్త్వమె
ల్ల నెఱిఁగి దీర్ఘజీవియుగులాగున దీవనగాంచి పొల్చు నా
హనుమయుగానముఁ వినఁగ నయ్యెడనుండు టెఱింగి చెప్పమో

యనఘ? హరింగురించి మునయజ్ఞుల తిక్కలడంగు మచ్చటల్॥ ౩౮

మ॥ హనుమంతుం డది యాలకించి వినుఁడయ్యా? సర్పరాజుల్ మహా
ఘనుఁ డాతం డొకనాఁడు మున్న తనిమీర్గట్టన్ బ్రియత్నించి వం
చినకిన్కన్ దనుజేంద్రపుత్రకుఁ డొగిన్ బ్రేరేఁపఁగా మాఁగివి
చ్చిన దన్ జచ్చినదిన్ సమస్తమును నేఁ జెంతన్ విలోకించితిన్॥ ౩౯

ఉ॥ అంగన "సర్వజాతిపయి నాహరికిన్ గన" లంచు మీరు మీ
స్వాంతములన్ దలంచుటది చాలఁ బ్రమాద; మెవండుగాని దు
శ్చింతత నొడ్లకున్ జెఱుపుచేసెడి జంతువులన్ సహింపఁ డే
మంతు లెఱుంగకుండిన యమాయకులన్ వధియింపఁ డెన్నయిన్॥

శా॥ మీలోను త్తము లెందఱో కలరు నెమ్మిన్ వారిఁ బూజింపదే?
పూలుంబత్తిరిగూర్చి లోకము; జగంబున్ దుఃఖపగాఁ జేయుదు
శ్శీలవ్యాప్తిఁ గలవారినో? లగుడముల్ చేఁబూని మర్దింపఁగా
నాలోచించుచునుందు రెవ్వరుని దా మాంబాలగోపాలమున్॥ ౪౦

క॥ కావున గోపాలుండటు
మీవానిన్ గాఁచియున్ క్షమింపమి తప్పే?
యావిష్ణువు దుష్టులనిం
కేవారిన్ సైఁచె మీర లెఱుఁగరె? నాగుల॥ ౪౧

తే॥ గీ॥ శిష్టరక్షణమున, దుష్టశిక్షణంబు
నతని కృత్యమ్ము లగుట మీ యందె కాదు
ఎవరియందైన దుష్టుల నేరి శిక్ష
సేయు శిష్టుల నలమిఁ గ్రైసేసి ప్రోచు॥ ౪౨

ఉ॥ "వాలినిజంపి నాతి"డని వాలమునుగిల్గిన యస్మదాదులా
శ్రీలలనామనోహరుని సేవను దూఱుటలేదు, వాలి దు
శ్శీలము వాలిజీవము నశింపఁగఁ జేసెనెకాని యాతనిన్
గూళతనాన రాఘవుఁడు గాల్పఁడు ప్రాజ్ఞులు మీ రెఱుంగరే?॥ ౪౩

శా॥ మీజాతిన్ గడుఁ బ్రాజ్ఞు లెందఱో మహామేరుప్రకాశుల్ గలా
రోజన్ వ్యాకరణంపు భాష్యము నెవండో కాదు మీచుట్టమే

రాజదోర్గ సహస్రశాఖహారిపర్శ్వన్ జేసి నిర్మించె మీ
యోజాడ్యమ్మతఁడాలకించు నెడ "ఛీ?ఛీ?" యంచు గర్హింపఁడే॥

ఉ॥ ప్రాజ్ఞతలేనివాండ్రురక ప్రాజ్ఞులు న్రెంతెఁ దలల్ గదల్చుచున్
విజ్ఞులు సెప్పు వాక్యములు వేగిరపాటున నవ్వచుందు ర
ల్పజ్ఞత కిద్దియే గుఱుతు భావిసమస్తమెఱుంగునట్టి స
ర్వజ్ఞుని మాట "కా" దనఁగవచ్చునె? యించుకజ్ఞానమున్నచో॥ ౪౬

తే॥గీ॥ జ్ఞానలవదుర్విదగ్ధతాధీనులైన
మిమ్మువంటి యల్పజ్ఞులహమ్ముపూని
సల్పు దుష్కార్యములఁ జేసి జాతికెల్ల
వచ్చునయశంబు ప్రాజ్ఞులవలనఁ బోదు॥ ౪౭

మ॥ హానిమీలో నెవఁడో యొకానొకని మాద్యచ్ఛిద్రు వర్జించి మేల్
తెఱువున్ జూపిన యంతవానిపయిన్ ద్వేషించి దూషింతురే?
నరి? లేశింతయు మీభుజంగపతి తాఁ జర్చింపలేఁ డొక్కొ? త
చ్ఛరణమ్ముల్ భజియించు నిచ్చలును దచ్ఛయ్యాకృతిన్ బొందుచున్

ఉ॥ అల్లభుజంగరాట్టునకు నంతరముండదె? మీకు నుంత; మీ
యుల్లములందుఁ జూచికొనుఁడూరక శ్రీహరిపై నవాచ్యపుం
బ్రల్లదముల్ లిఖింపకుఁడు భావభవారి వచించుచొప్పు సం
ధిల్లు ముదమ్మతో వినుఁడు ధృష్టతమానుఁడు పూనుఁడీనుడుల్॥ ౪౮

ఉ॥ నావుడుమున్ను లేచు నలనాగమిటుల్ వచియించె జాళిలో
నేవగ నెవ్వఁడో యొకని కెవ్వఁడో తానపకారిగాఁ బరీ
భావముతక్కువారలకు బట్టవటంటివి మున్నొకండు భూ
దేవుఁడు నీపునల్పు నుపదేశమెఱుంగకమున్నె మోఁదఁడే॥ ౪౯

శా॥ ఏదో కొండొక నాగమాతని సతిన్ హింసింపఁగా జచ్చియో
మీఁదన్ దత్సతి చల్లగా బ్రతికె నామే లేనిఁ జింతింపకా
భూదేవుండు వధింప,గాఁ దొడఁగమమ్ముం బోట్లనెల్లన్ జూరిన్
వేదాంగమ్ములు వేదముల్ నదివి యవ్విప్రుండు నప్రాజ్ఞుఁడే॥ ౫౦

చ॥ ఒకనికతాన నార్తిమెయి యుల్లము నుండి మదీయజాతికం
తరునతఁ డెల్లు శత్రువయి తజ్జతనంబు చరించె నట్లు యే
మొకని నికారముల్లముల నూనెదమెల్లర; మూనియూహరి
ప్రకట తరాంఘ్రిపూజలకుఁ బాల్పడమిందొక దోసముండునే?॥

చ॥ ఇటు కటురీతిగాఁ బెనఁగు నిట్టలపుం జెనుపాముసేయు దూ
రటనము సభ్యులెల్లదుభరమ్ముగ రోసిరి వాయుసూతియు
త్కటరుషుఁడయ్యె, నయ్యెడలఁగాలగళుండు నిజాశ్రితాళి లం
పటహృదయుండు భక్తజనమంతునివారణధీరుఁ డిట్లనున్॥ ౧౨

చ॥ సతతపురాణ సూరిజనసమ్మతికిం గుసుమైనఫక్కి వీ
కితివుపదేశమున్ సలిపెనీహనుమంతుఁడ మంతుభావ సం
గతిఁ జనుటొప్ప సర్వజనకాలుని నీవనినట్టి విప్రుఁడున్
క్షితిసురుఁ డొక్కరుం "డిట్టులు సేయుట తప్పు"ని మందలింపఁడే॥ ౧౩

చ॥ కావున నా యుదాహృతిసగ్రకొనికాళియుఁ బట్టి మీరలా
శ్రీవరుపై దురాగ్రహముచేకొని క్రమ్మనుట చెడ్డతప్పు, లో
కావనశీలుఁడా హరి మహామహిమంబు నెఱుంగశక్యమే?
మీవలెఁ బస్వతోత్రవలకు మేళనుదుర్వ్యషజాతికెమ్మెయిన్॥ ౧౪

తే॥గీ॥ అంతఖండితముగఁ జెప్పుహరుని గూడఁ
జనవునన్ జేసి యాసర్వజుఁడు గణన
సల్పకేమేమి మ్రోగిఁనుచు జాతికెల్ల
మచ్చరముగల్గఁ జేయు నమ్మాడ్కినుండె॥ ౧౫

కం॥ అంత హనుమంతుఁడను నో
మంతుహరా? సాంబ? నీదుమహనీయకృపా
గంతురితైశ్వర్యధురా
వంతము లీపాము లుఱకవంగునె? నుడులన్॥ ౧౬

శా॥ ప్రత్యక్షమ్మునఁగాని లోఁగ రిల నప్రాప్తల్; హరిందూఱ రో
కాత్యాయన్యధినాధ? కీడ్వడిన వేడ్కల్ దృశ్యమానట్లుగాఁ

బ్రిత్యేకించి ప్రదర్శనంబొనరుపఁ బాత్రిల్మాలుటల్ మాని యీ
వ్యత్యస్తోక్తులువీడి శ్లాఘపడి సంభావింతు రయ్యుద్యతుల్ ॥ ౫౭

ఉ॥ ఔ? నదిబాగు బాగగు నయె సాహసమాంతుని మాటకుల్ శివుం
డా నగజామనోహరుని యంతరముల్ గని పెట్టి వెంటనే
ధీనిధి నందికేశ్వరుఁడు తెయ్యతకత్తక యంచు మర్దల
ధ్వాన మొనర్చె దిగ్గజవితానము గుండెలు గూడ "ఝ"ల్లనన్ ॥ ౫౮

ఉ॥ నాందిపఠించె సూచన గనంబడఁజేసెన్ శిశుపాలదుర్వచః
క్రిందనముల్ వినంబడిన కైవడి సభ్యుల కెల్లఁ దోఁచె న
స్పందయశుండు ధర్మజుఁడు శౌరికి నర్ఘ్యమొసంగు సత్కథా
చందనవల్లికా కుసుమసౌరభసార భరంబు వెల్వడెన్ ॥ ౫౯

(ఇది ప్రస్తావన)





# పాండవ రాజసూయము

(అంత సహదేవుఁడు సాట్టహాసముగాఁ బ్రవేశించును)

సహ॥ (సుత్రితి నభినయించి)

శా॥ వామం బీచరణంబు వానితలపై వర్తింపఁగాఁ జేయుఁదా
నీవై నీసహదేవుఁ డెవ్వఁడు వృథాహేయమ్ములన్ గూసి స
ర్వాక్షేపయుక్ జగదీడ్యు గోపతిని సత్యాలంబి నర్ఘ్యప్రదా
నామాన్యుండని ప్రేలునో మరల సవ్యాజాంతరంగమ్ముతో ౧

శిశుపాలుఁడు॥ (ప్రవేశించి సవైలక్ష్యస్మితముతో)

మ॥ మరలన్ జెప్పినఁగాని నీచెవులకున్ మామాట విస్పష్టమై
చొరఁబోదో కా? సురాపగాసుతుబలెన్ జూపుల్ చెవుల్ నీకు మం
ధరభావంబు వహించెనోటు? మరలన్ వాక్రుత్తు నక్లేని నీ
చరణం బెట్టెదో? చూపు; నీచరణానాసారంబు వారించెదన్ ౨

సహ॥ (సక్రోధాట్టహాసముతో)

మ॥ మరలన్ బ్రేలుచునుంటి ప్రేలుము జగన్మాన్యున్ మునిద్వంద్వన
ధ్వరరూపున్ హరి నే తదన్యునిగ; నీతప్పంబ్రలాపమ్ము రూ
పఱ నీమస్తక మస్మదీయచరణధ్వస్తమ్ముగావించి నిన్
బురికొల్పన్ బ్రయతించురాజులకు నుద్బోధంబు సద్బుద్ధులన్ 3

శిశు॥ (కొండొక సమీపించి)

మ॥ ఇదిగోఁ జక్కఁగవిన్ము చెప్పెదను టూరీనిండుపేరోలగం
బెదరింతేని గణింప కొక్కచెనఁటున్ హీనున్ దురాచారు న
ర్మదుగోపాలకు నగ్రపూజ్యునిగ సంభావించినా రిప్పు, డే
మదితో కొక్కవచియించుమాటలపయిన్ మోమోటమున్ జూపుదున్॥

క॥ మరలన్ జెప్పెద నిట్టుల్
మరలన్ మరలన్ వచింతు మరలవచింతున్
మరలన్ మరలన్ మరలన్
మరలన్ వచియింతు నీకుమగఁటిమి గంధున్॥ ౫

సహా॥(తీవ్రకోపముతో నెడమకాలు పైకెత్తి కుడికాలుతోఁ ద్రొక్కుచు)
మ॥ ఇదె; నీనాలుకఁజీల్తు నిద్దిగొ? శిరం బీకాలమర్దింతు దు
ర్మదమాటింతు మహోగ్ర పూజ్యునవఁదున్ మామందుండిటుల్ పేలుటల్
వదలింతున్ దులువా? యగోపలువు నీవాచాలకత్వమ్మిదే!
తుదముట్టింతు జగజ్జనార్చితుఁడు నిందింపంగ నేట్లు లోతుంటరీ॥ ౬
అంత ధర్మజాదిపాండవులును భీష్ముఁడును బ్రివేశింతురు)

ధర్మ॥ (సహాదేవుని మధ్యేమార్గమున నాపి నెమ్మదిగా)
ఉ॥ ఎంతయు శాంతభావమున నిక్కపునాఁదగుసేకు నింతగా
స్వాంతము మార్పుచెందుటకు శౌరినిరాకరణంబు హేతునా
యింతు నటేనియున్ మనకు నేఁడురఁ గోపము పిల్చినట్టి భూ
కాంతులమీఁద; వారొకటఁగష్టపుగష్పథ మూనిరేనియున్॥ ౭

తమ్ముఁడా? వా రతిథులు, మన మాతిథేయులము. కావున శాంతింపుముఁ (శిశుపాలుదిక్కు) రాజవరా? నాయీమాట లాలింపుము.

ఆ॥ వె॥ సకలధర్మవేది బ్రహ్మపిపుత్రుని
యనుమతమునఁ జేసి యర్ఘ్య మచ్యు
తున కొసంగినార మనఘ! యెందులకయ్య?
యురక దూఱఁదొడఁగి తొర్పువిడిచి॥ ౮

శిశు॥ [ఎక్కసక్కెముగా]

ఉ॥ చాలునుజాలు గొల్లనికి సత్కృతిఁజెప్పెడి భీష్మ తెల్వి, నీ
బాలిశతాప్రసంగమును; బార్థివులెల్లరు నిన్నుదారస

చ్ఛలుసిగా గణించి యిటఁ జేరినదానికి బుద్ధిచెప్పి తే
గోలయు నీవొనర్చుపని కూడదునా కెద సమ్మతించునే?॥

(కోపతిరస్కారములతో)

శా॥ వాచాదత్తను రుక్మిణిం గొనియె న న్వంచించి యీగొల్లవాఁ
డీచౌర్యమ్మును భీష్ముఁ డేగతిని సత్కృత్యమ్ముగాఁ జూచెనో?
ఛీ? ఛీ? యీసభనుండఁగూడదు యశశ్శ్రీమానధన్యుల్ నృపుల్
కాచంబున్ మణిగాగణింతురట సత్కారంబెవం డొప్పెడిన్॥

(అని మరలిపోవుచు) ఓహో! మానమహితులగు నో రాజకుమారులారా!

శా॥ జారుల్ చోరులు బ్రహ్మవేత్తలిచటన్; సత్కారమవ్వారికే
ప్రారంభంబున నయ్యెడిన్ దదితరప్రాజ్యావనీపాలకుల్
గారగ్రాహ్యులు, తాతగారిటులువల్కన్ మన్నలాలింత్రు, మీ
శూరత్వమ్ములు కాల్పనే? కదలుఁ డిచ్చోనిల్వ సిగ్గయ్యెడిన్॥

(అని తొందర సభవిడిచిపోవుచుండఁగా)

ధర్మ॥ (వెంటఁజని సగౌరవముగా నాపి)

ఉ॥ ఏటికిఁ దత్తఱపడి నృపేంద్రులకెల్లఁ గరున్ మనమ్ములన్
గాటపుఁగోపసుల్ రగులఁగా గమకించెదు నిల్వుమయ్య? యే
పాటియుఁగాఁడు కృష్ణుఁడని పల్కితి వందునుఁ గూర్చి యీసభా
వాటమునన్ విచారణము ప్రాజ్ఞులచే వినవచ్చునచ్చుగన్। ౧౨

నీవాందమే ప్రాజ్ఞసమ్మతునుగు నేసి మా యొనర్చిన తబ్బిబ్బు సవరించుకొందుము. లేదా? నీవేని యిటులొనర్పవచ్చును. కొండొక కోప ముపశమింపుము.

భీష్ము॥ (సమందస్మితక్రోధముతో) ధర్మజా! యేమిటికవ్వాని నట్లు బతిమాలెదు.

చ॥ ఎఱుఁగునువాఁడు కృష్ణు జగదీడ్యత; సత్త్వపరాక్రమాదికం
బెఱుఁగు, నృపవ్రజమ్మునకు నెల్ల నసూయజనింపఁజేసినన్

బోరఁగొనవచ్చునంచు మది బోలేఁడుకోరిక వానికున్న దీ
శ్వరుని త్రివిక్రమున్ జెనఁకువాఁడెవఁ డీసరపాలపాలిలో॥ ౧౩

అంతటి నరదృష్టవంతుం డెవ్వాఁడేని యున్న "సహేంద్రతక్షక" న్యాయమ్ము ననుకరింతురు, నిశ్శూరమ్మన్య నేలయనుచయించెదవు?, వీఁడు నీవంటివారి యనునయమ్ములకుం దగఁడు విరమింపుము.

శిశు॥ (పండ్లుగొఱుకుచు)

శా॥ ఏమో? పెద్దలెదు నీకతానఁ జెడె నేఁ డీ రాజసూయంబు; నీ
మోమోటమ్మునఁగాదె గొల్లని నెగిన్ బూజించె నీతేఁడు; నా
ర్యామేయుల్ జగదేకధన్వులు యశోనంతుల్ ధరాకాంతు లీ
సామాన్యార్చకు సైఁచ నెట్టులరకే? చర్చించి వారు నిత్తువే॥ ౧౪

భీష్ముఁడు॥ (శిశుపాలుని కుత్తరమీఁబోఁగా)

సహ॥ (భీష్ముని సగౌరవముగా వారించి) తాతా? యీపశుప్రాయుని గుఱించి మీ రించుకయుఁ బ్రత్యుత్తరమీకుండ నిదె మిమ్ము భ్యర్థించెద, వీనికిం దగిన ప్రాయశ్చిత్తమ్మునకెల్ల మదీయ వామచరణమే పూఁటవడియున్నది. (శిశుపాలుదిక్కు మొగమై మండిపడి)

మ॥ పరమాపాత్రశిరోమణీ? త్రిజగతీవంద్యుండు కృష్ణుండు భూ
వరవర్గమ్మున నగ్రపూజ్యతకునై పాత్రుండు గాఁడేమి? నా
చరణం బీనుడి పెల్లు నీకు నిపుడే సద్బుద్ధి చెప్పున్ శిరో
భరమల్లనంతనదీతి బాగుపడెనో వాచాటవారాగ్రణీ? ౧౫

(సభ్యులకెల్లఁ దనయెడమకాలిం జూపుచు)

శా॥ ఈవృక్కుండవె కాముసూ? యిచట సింకేపార్థివుండేని యీ
శ్రీవాసార్చన మేవగించునొ? యిదే శీర్షంబు మద్వామపా
దావాసంబగు వాని, దం చెఱుఁగుమా రా! భీష్ముసల్లంతవా
"దేవం కార్య" మనన్ యజించితిమి నీవేపాటి? మూర్ఖాగ్రణీ? ౧౬

(తెరలో)

శిశు॥ (సధైర్యస్మితముగా) ధర్మజా! నీతమ్ముండుపసివాఁడనియు నీతాత ముసుకండనియు నీ రెంతనోరుచేసికొన్నను మామనమ్ముల కంతగా నొప్పితగులుటలేద నీయందిరాజలోకమెల్ల స్నిగ్ధమ్మగుటకుఁ గతంబు నీధర్మవర్తనంబకాని, నీతమ్ములబలపరాక్రమమ్ములుగావు, సకలరాజలోకవిశ్వాస్యమ్మగు నీయోగ్యతాలత కీభీష్ముండు వేలుపుగున్నై ముఖపోష్యమ్మాపాదించుచున్నవాఁడు, (భీష్ముదిక్కు)

ఉ॥ ఏనొకబ్రహ్మచారినని యెంతయుఁబొంగెదు నీదువర్ణితా
ఖ్యానము మండతొప్రభవమంచుఁ దలంచెద మేము ధర్మవి
జ్ఞానము దంభమాత్రమధికమ్ముగ నిన్నునుదూఱుచేల? నీ
వీనలినాక్షుఁ బూజ్యునిగ నేగతిఁ జెప్పితి నాకుఁ జెప్పుమా॥ ౨౨

(కేలనిర్దేశించి) ఆరాచమండలముం దిలకింపుము.

శా॥ అం దేరాచకొమారుఁబోలఁగలఁ డయ్యబ్జాక్షుఁ డైశ్వర్యపుం
సందర్భమ్మున; శౌర్యధైర్యగరిమం జాతుర్యసౌందర్యని
ష్పందఖ్యాతివిశేషసంపదల; నప్రాజ్ఞుండవై యిందఱిన్
నిందింతే? కడువృద్ధమూర్ఖపసిమున్నింతేమి భూపాలకుల్॥ ౨౩

సీ॥ ద్రోణునికన్న నాద్రోణాత్మజునికన్న
దుర్యోధనునికన్న ద్రుపదుకన్న
కర్ణునికన్న నకాంభోజవిభుకన్న
భగదత్తుకన్న నపాండ్యుకన్న
భీష్మకుకన్న నవ్విరటుకన్నను మ
ద్రపతికన్న సింధుభూపాలుకన్న
భూరిశ్రవునికన్న భూతగేశ్వరుకన్న
నేకలవ్యునికన్న నెవరికన్న

తే॥ గీ॥ మఱియు ద్వైపాయనునికన్న మహితశక్తి
నైన నీకన్న నాకన్న నన్యుకన్నఁ

కృష్ణుఁ డేపాటివాఁడని కెడలి యర్ఘ్య
మీయఁ జేసితివోయి గాంగేయ! నీవు॥ ౨౪

అదియటులుండె, ఇంతవఱకీగోపాలుండొనర్చిన మహాకార్యము లెయ్యవి?, స్త్రీఘ్నుండును, గోఘ్నుండును, కృతఘ్నుండును, నగువానికగ్రపూజ్యతయెట్టిది?, ఇఁక వల్మీకమాత్రమ్మగు నగమ్మెత్తుట కేవలగవుపాలవగు నీకు నాశ్చర్యజనకమయ్యె బాహుబలాఢ్యులగు భూపాలుర కట్టిదిగాదు, పైఁగానీతఁడు లజ్జావిహీనుండనుట కావంతయు సందియమ్ము లేదు.

శా॥ నారుం బత్నిగనీయనున్న నృపకన్యన్ దొంగయై కాదె? మీ
శ్రీకృష్ణుండు గ్రహించె నిజమునకున్ సిగ్గున్నదే? యన్యకాం
తాకళ్యాణము లిచ్చగింతురె? యశోధర్మస్పృహుల్ పేదు; లీ
నీకృష్ణుండెటు పూజ్యుఁడంటి చెపుమా? యీసభ్యు లాలింపఁగన్ ౨౫

మఱియు నీవిట్టికీపంద జగదేకవీరుఁడగు జరాసంధు వంచించి భీముచేఁ జంపించిన తెఱంగు శూరలోకదూరంబని యెఱుంగనిది కాదు, సర్వము నెఱింగి నీవితనిఁ బాహ్యనెట్లగ్రపూజ్యుండని స్తుతించితివి,

ఉ॥ బాలిశుఁడైనకృష్ణుని సభాజనమాన్యునిగాఁగఁ జెప్పి ల
జ్జాలవమేనిలేక కడుసజ్జనునింబలె ధర్మపన్నముల్
చాలవచించు నీచెఱుగసజ్జనలోకులనంతలింతలై
చీలని హేతువేమి? పరిశీలనఁ జేసి వచింపనేర్తువే? ౨౬

భీము॥ (కనులెఱ్ఱఁ జేసి ముందిపడి)

మ॥ ఖల? వాచాట? రటద్వృథావదన? నీకాలంబు దాపయ్యెనే
మిగ? మూర్ఖాగ్రణి? యాపగాతనయు పేర్మిన్ సుంత లెక్కింపవ
ధ్వరమూర్తిన్ జగదీశ్వరుఁ గృష్ణుని వృథాపాపమ్ములన్ గూసెదో
దురితాత్మా? యిదె నీశిరమ్ము గదచేఁ దున్మింగించెదన్ బ్రేల్మిడిన్

(లంఘించును)

భీష్ము॥ (అడ్డపెట్టుకొని) తండ్రీ! భీమసేన!

మ॥ విపులమ్ముల్ సహజారుణమ్ములు రుడావేశమ్ము కల్మిన్ దప
త్తపనప్రాయములై భవన్నయనముల్ ధార్త్యమ్ము మారించు నే
రిపుభూపాలునకేని; నీడన గతప్రీతుండు నిర్భీకుఁడే
విపరీతోక్తులొ ప్రేలుఁగాని నయమున్ వీక్షింపఁ డత్యంతమై ౨౮

ఉ॥ వీఁడు పరాక్రమమ్మునను, బెద్దయుఁ బేర్కొనఁదగ్గ వాఁడు ని
వాఁడిమగంటిమిన్ జెడని వైఖరి కన్యనిమిత్తమున్న దా
జాడ యెఱుంగఁ జెప్పెదను, శాంతివహింపుము మిన్నకుండు మీ
గాడిదనంటి దేహమును గర్వములమ్మన్ బోనరించు టర్హమే ౨౯

శిశు॥ (నిర్లక్ష్యముగా) తాతా? రానిమ్ము, నివారింపకుము,

చ॥ మురుకఁడవీవు వాయుజుఁడు ముష్కరుఁ డించుక యస్మదీయ దో
ర్మదము నెఱుంగుఁగాక వెస మామకశౌర్యదవానలంబునన్
గదయును దానునున్ మిడుతకైవడి మ్రందునుగాక యాఁగఁబో
కెద మఱి వాని కెంతటియభీప్సితమున్నదొ? నీవు చూచెదన్ ౩౦

భీమ॥ (భీష్మునియాజ్ఞపై రోజుచు నిల్చును.)

భీష్మ॥

శా॥ ఈకష్టాత్ముఁడు నిగడంబెడఁడు లో కేశుండు కృష్ణుండు ప
ద్మాకాంతుండగు మారకుండని మదిన్ దర్కింపుము వ్వాటము
న్నాకాశోక్తి స్థిరీకరించె సమయంబయ్యెన్ బరున్ వీఁడు తా
నాకంజాక్షునుదర్శనంబున శిరంబామూలమున్ ద్రెళ్ళఁగన్॥ ౩౧

వీఁడు చతుర్భుజుండును, త్రిలోచనుండునై పుట్టి రాసభంబుంబలె నార్చిన నావికృతిస్వరమ్మునకు శంకించి తల్లిదండ్రులు విచారించుచుండ నంబరవాణి యుపశమవాక్యమ్ములు చెప్పి వీఁడు బలాఢ్యుండును శూరుండును, ననన్యసాధ్యుండును" నగుననియు, వీఁడెవ్వనియుత్సంగమ్మునఁ గూర్చుండు నెడల నివికృత స్వరూపమ్ము వదలి సామాన్యమానుషాకారమ్మునందునో వాఁడ వీనికిమృత్యువగు" ననియుం జెప్పెను వాఁడెవ్వండగునో కో? యని కనవచ్చిన రాజులయుత్సంగమ్ములం దెల్ల

వీనిం గూర్చుండఁబెట్టుచుఁ దల్లి పరిశీలించుచుండు నెడలఁ దనమేనత్త కొమరుఁడగు వీనిం జూడ నొకపరి శౌరియేతెంచె, అంతయథాపూర్వముగ నీతని నాతనియుత్సంగమ్మున నిడుటయు విషములోచనంబును, నభ్యధిక బాహుద్వయమ్మును, జారి పీనియిప్పటియీరూపంబు నిలిచె నదికాంచి తల్లి శ్రీకృష్ణునివరమ్ముకోరి వీనివధింపకుండ ననుగ్రహింపుమనుటయు, నావరమునం దపరాధశతాచరణమ్ము మితిగా నావరం బనుగ్రహించె, ఆయపరాధములునిండె నింకవీనివధించుటయ కిడము, కావున నీవు శాంతింపుము.

శా॥ నీకన్నన్ బలియుండుగాఁ డతఁ డీ నీచుండు నీపైకిటుల్
శ్రీకృష్ణుండిదు నావరమ్ముకతనన్ జేసాచుచున్నాఁడు నీ
వీకాలమ్మున శాంతిమాపు మతఁడే యీదుష్టు శిక్షించు దు
ష్పారుల్ వీనికిఁ గోడుసూపు నృపకుల్ వాపోయి కూపెట్టఁగన్॥

శిశు॥ (వికృతస్మితముతో)

ఉ॥ తాతయు మన్నఁడున్ ఋజువిధమ్మున శాంతినిఁగొంటిరే? ముఖ
ప్రీతులుగాఁ గ్రహించు రిపువిరులు నవ్వఁగు; మేలు? మేలు? సీ?
కాతకులార? మీ ప్రబకుదుకాల్పనె? (భీష్మునిమాత్రమే కేలనిర్దేశించుచు) భీమునిమాటలకేమిఁ నీ
వాతకిబుద్ధి చెప్పి పశువై ఖరి నిన్ను వధించుటొప్పెడిన్॥ 33

(తెరలో)

ఉ॥ మంచిగఁ జెప్పితీవు మతిమంతుఁడవీనదిసూనుఁ డెంతయున్
జంచలబుద్ధియె పలికె శౌరికి "నగ్రసపర్య సేయు" మం
చంచితుఁ జేసె ధర్మజుఁ డనర్హునిఁ గృష్ణుని గొల్లబోయని
వంచకు భీష్ముఁ బట్టి పశువై ఖరిఁ జంపుట కర్హ మెమ్మొగిన్॥ 34

(సింహనాదము లొనర్తురు)

భీష్ము॥ (వినుటనటించి గంభీరకోపముతో)

శా॥ ఓరీ? రాజకులాధముల్? పలికితిరట్లోలి న్ననుంబట్టి క్రో
వ్వాలి జంపుఁడు లెందుమీ శిరములం దారూఢిమత్పాదమొ
ప్పారన్నిల్పితి నేల యోర్చెదరు? రండా? భండనోద్యుక్తులై
శూరత్వమ్ములు సూపి రాజకులవిస్ఫూర్తిన్ బ్రవర్తింపుఁడా॥ ౩౫

(శిశుపాలుదిక్కు)

శా॥ ఓయీ? మూర్ఖ? జఘన్య? నీయతినీచోక్తుల్ చెవుల్ సోఁకియు
న్నీయుద్రేకము మాన్ప శాంతనవుఁడింతేనిం బ్రయత్నింపఁడా
మ్మాయధ్యేయుఁడు నందనందనుఁడు నిన్ మర్దింపఁగాఁ బుట్టినాఁ
డాయజ్ఞేశ్వరుఁ జేరి పోరి వారుమా? యద్దేవు తేజమ్మునన్ ౩౬

కం॥ హరియై హిరణ్యకశిపున్
హరిణముబలె నడఁచె నరవరాకారమునన్
బొరిఁగొనె రావణు నవఁడా
పరమేశుఁడు శౌరి నిన్నుఁ బట్టివధించున్॥ ౩౭

(తెరవంకఁ దిరిగి)

ఓహో? స్వశక్తి పరశక్తి జ్ఞానశూన్యులగు నోరాజన్యకీటములారా?

శా॥ మీలో నేరికిఁ జావు దాపగునో? మార్గ్గాలముం బోలెనో
పాలున్ జేరి పరాక్రమింపుఁడొగి జీవభ్రాంతిసుం జేసియున్
వాలాయమ్ముగనున్న రాజకుమరులా వైపేని వీక్షింపకుం
డోలిన్ దెల్పితిఁ గృష్ణుమార్కొనిన నాయుర్భాగ్యముల్ రూపఱున్

శిశు॥ (సాధిక్షేపముగా) తాతా? యిటుచూడుము

చ॥ పొగడెదు సారెకున్ హరిని బూతువిధానఁ బొగడ్తకర్హులై
నెగడెడు రాజులుండ నవనీపతిగాని యనాథు సింతగాఁ
బొగడెద వేటికో? ముదుకబుద్ధికిఁ గర్జము లెట్లు దోఁచు మేల్
మగఁటిమి గల్గెనేని ననుమార్కొనఁ జేటికిఁ గృష్ణుఁడిమ్మెయిన్ ౩౮

(తెరవంకఁ దిరిగి బిగ్గరగా)

ఆ॥ వె॥ రాఁగదోయి? బావ? రారమ్ము నిన్నుఁ బాం
డవులంశోవధింతు నవనిపతులు
మెచ్చిపొగడ; నర్ఘ్యమిచ్చినందుకు వారి
కిపుడ ఫలముఁగల్గు టెఱుకపడఁగ॥ ౪౦

శ్రీకృష్ణుఁడు— (ప్రవేశించి తనలో)

క॥ అపరాధశతము సైఁచి శి
శుపాలు వధియింతుననుచు సూనృతగతి నీ
కపటాత్ముతల్లికిచ్చితి
నపుడు వరము శతము నింతకయ్యెఁ దొసఁగుల్॥ ౪౧

ఇపుడు నూటొకటవ యపరాధమ్మున కీజనుండారంభించె. జగ
ద్ద్రోహి పాపాతిపరాయణుండగు నివ్వానినిఁక సైఁచుట పాడిగాదు (రాజుల
నుద్దేశించి ప్రకాశముగా)

ఉ॥ ద్వారకగాల్చె బభ్రుప్రమదన్ హరియించెఁ గట్టి పెట్టె నీ
చెరహితుండు మున్ను వసుదేవుని యాగతురంగమంబు; దు
ర్వారము లెత్తి వేని యపరాధము లిట్టి విసర్పె వీనిపైఁ
గారుణముంటఁ జేసి యలుగన్ వరమిట్టిది తల్లికిచ్చితిన్॥ ౪౨

ఉ॥ ఆపర ధర్మసూనుఁ డిటకి నప్పుడు సంగతి నావరమ్ము; నీ
నాపరుఁడా వరమ్ము ఫలు, గల్గఁగఁ జేసె నపారకత్వ; మిం
కేవనుఁ షర్ క్షమింపవలె నీ చెనటిన్; నృపులెల్లరుం గనం
గావలమార్చి భూజనులకష్టము వాయఁగఁ జేయుదొప్పదే॥ ౪౩

(తెరలో)

ఉ॥ నందకుమార? "మేల్బళి"? యనందగు పల్కు వచించితీవుని
న్నందురె? యోగ్యులైన నృపు; లధ్వరమూర్తిసి వీడు వీసికోఁ
గొందఱు కర్మదుల్ గలిసికూసిరి కూళతనంపుఁ గూత; లీ
తుంటను మునుల్ హరించుటది దోసముగా మనుమా? రమాధవా॥

కృష్ణు॥ (తనలో) ఇవిప్రాజ్ఞులగు రాజర్షులపలుకులు వృద్ధసమ్మతమ్ముగ
నిఁకనివ్వాని వధించెదం గాక (ఆకాశమువంక దృష్టినిగిడ్చి)

ఉ॥ రమ్మిటు చక్రరాజమ? పరాక్రమ గర్వితుఁడైన చైద్యమూ
ర్ధమ్ముహరించి వేగ నిజధామముచేరుము ప్రాజ్ఞరాజలో
కమ్మునకున్ ముదమ్మగుఁ గల్మలభూధవ హానికెల్లనుం
ఖమ్ముఘటిల్లుఁ గాక మఖకార్యము నెగ్గుఁ బూర్ణకాముఁడై॥ ౭౫

(చక్రమువచ్చి శ్రీకృష్ణుని హస్తమున నిల్చును)

శిశు॥ (అధిక్షేపముగా)

ఉ॥ చక్రము గిక్రముల్ గనివెఱన్ భయమందెడి వాఁడఁగాను నీ
వక్రతమూన్ప సిద్ధపడివచ్చితి భీష్ముని మాట పోల్చగా
సక్రమభంగి నాలమున శౌర్యము చూపివధింతు నిన్ను; నీ
విక్రమముల్ గనంబడుచు వేళయిదే? తడవేల చేసెదో?॥ ౭౬

కృష్ణు॥ (శిశుపాలుదిక్కై)

చ॥ అల తఱి రుక్మిణీరమణి నట్లువరించెడినాఁడు నీకుదో
ర్బలముఁ డేసి శీర్షపుభరమ్ము డిగింపని నీకు దుర్మదా
విలత కడుంగడుం బెరిగె వేఁగు ముచ్చట్టిన వానిపోల్కెనో
తులువ? చెడంగఁ బేలెదవె? దుండగపుం జెనకూఁత లేటికిన్ ౭౭

శిశు॥ (కొందరగా)

శా॥ నీకున్ సిగ్గుఁ గొవమ్ము నుంగలదె! యెన్నిలున్న యిచ్చోట ము
న్నాక్రోశించిన రుక్మిణీరమణి విన్నాణంపుఁ బెండ్లిన్ వచిం
తే? కొంకింతయు లేక; నాఁడె నిను ప్రమందింపన్ ప్రయత్నించితిం
గాకెట్లో బ్రతుకంగ నేర్చి తిపుడకార్యమ్ము పూరించెదన్ ౭౮

కృష్ణు॥ (బిగ్గరగా)

చ॥ కనుఁడు నృపాలకుల్ కనుఁడు కల్మలచిత్తుని మీరలెల్లరున్
గనుఁగొనుచుండఁ జంపెద నికన్ సయిపంబని లేద నన్ను నీఁ

డనుటకుఁగాదు భీష్మునిమహామహు దూఱినదానికిన్ ఫలం
బునుగనుఁగాక దుర్మదులబుద్ధివిహీనత లింతఁగాఁపుతన్ ౭౯

(చక్రమును ప్రయోగించును — తెరదింపుదురు)

నాందికేశ్వరుఁడు॥ (ప్రవేశించి)

• భరత వాక్యము. •

మ॥ మొఱకుల్ పూజ్యులపై నసూయగొనియున్మాలమ్ముగాకుండుగ్రగా
కురుబుద్ధుల్ కడువృద్ధులాడు పలుకుల్ యోజించి రైకాంద్రుఁగా
విరహింద్దూఱులు ప్రసంగముల్ జఱిపి వర్ష్యేదక్షిణాకుంద్రుఁగా
కరవిందాసను రాణి తా నిలుచుఁగా కస్మన్మనః పీఠకన్॥ ౮౦

(అందఱును నిష్క్రమింతురు)

గద్య

ఇది శ్రీ.....తిరుపతి వేంకటీయమ్మగు పాండవ
రాజసూయమ్మను నపూర్వనాటకమ్మునందు
సర్వమ్మును బ్రథమాంకము.

—• ఫలశ్రుతి •—

మ॥ ఇటు ప్రత్యక్షమొనర్చు నంతయురగంబిల్లొటకుఁ గొంకియూ
కటు వాగ్ధోరణి కట్టిపెట్టి యటుపైఁగంజాక్షపాదార్చనా
ఘటనాతత్పరులైన వారలగతిన్ గాంక్షించి తత్పద్ధతి
స్ఫుటరేఖాకలితోత్తమాంగమగు మర్త్యా బొల్పారెనాకల్పమున్ ౮౧

